శ్రీః

శ్రీమదప్పయ్యదీక్షితవిరచితా

# దుర్గాచన్ద్రకలాస్తుతిః

వ్యాఖ్యాత - డా॥ ముళ్లపూడి విశ్వనాథశాస్త్రి



ప్రకాశకురాలు

## శ్రీమతి రావి కృష్ణకుమారి

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

శ్రీమదప్పయ్యదీక్షితవిరచితా

# దుర్గాచన్ద్రకలాస్తుతిః

వ్యాఖ్యాత - డా॥ ముళ్లపూడి విశ్వనాథశాస్త్రి

ప్రథమముద్రణ : 09.06.2020
ప్రతులు : 500
పుటలు : 20
వెల : రూ. 20/-


404, Janjanam Complex,
Opp. I Town Police Station,
Chirala - 523 155.
Cell : 94401 15411

D.T.P. by :
P.PARVATHI
Cell : 74165 86775

Printed at :
Karshak Art Printers
HYDERABAD

శ్రీః

శ్రీమదప్పయ్యదీక్షితవిరచితా

# దుర్గాచన్ద్రకలాస్తుతిః

శ్లో॥ వేధోహరీశ్వరస్తుత్యాం విహర్త్రీం విన్ధ్యభూధరే ।
హరప్రాణేశ్వరీం వన్దే హన్త్రీం విబుధవిద్విషామ్ ॥ 1

శ్లో॥ అభ్యర్థనేన సరసీరుహసమ్భవస్య
త్యక్త్వోదితా భగవదక్షిపిధానలీలామ్ ।
విశ్వేశ్వరీ విపదపాగమనే పురస్తా-
న్మాతా మమాస్తు మధుకైటభయోర్నిహన్త్రీ ॥ 2

శ్లో॥ ప్రాఙ్నిర్జరేషు నిహితైర్నిజశక్తిలేశైర్
ఏకీభవద్భిరుదితాఽఖిలలోకగుప్త్యై ।
సమ్పన్నశస్త్రనికరా చ తదాయుధస్థైర్
మాతా మమాస్తు మహిషాన్తకరీ పురస్తాత్ ॥ 3

శ్లో॥ ప్రాలేయశైలతనయాతనుకాన్తిసమ్పత్-
కోశోదితా కువలయచ్ఛవిచారుదేహా ।
నారాయణీ నమదభీప్సితకల్పవల్లీ
సుప్రీతిమావహతు శుమ్భనిశుమ్భహన్త్రీ ॥ 4

శ్లో॥ విశ్వేశ్వరీతి మహిషాన్తకరీతి యస్యా
నారాయణీత్యపి చ నామభిరఙ్కితాని ।
సూక్తాని పఙ్కజభువా చ సురర్షిభిశ్చ
దృష్టాని పావకముఖైశ్చ శివాం భజే తామ్ ॥ 5

శ్లో॥ ఉత్పత్తి-దైత్యహనన-స్తవనాత్మకాని
సంరక్షకాణ్యఖిలభూతహితాయ యస్యాః ।

సూక్తాన్యశేషనిగమాన్తవిదః పఠన్తి
తాం విశ్వమాతరమజస్రమభిష్టవీమి ॥ 6

శ్లో॥ యే వైప్రచిత్త-పునరుత్థిత-శుమ్భముఖ్యైర్
దుర్భిక్షఘోరసమయేన చ కారితాసు ।
ఆవిష్కృతాస్త్రిజగదార్తిషు రూపభేదా-
స్తైరమ్బికా సమభిరక్షతు మాం విపద్భ్యః ॥ 7

శ్లో॥ సూక్తం యదీయమరవిన్దభవాది దృష్ట-
మావర్త్య దేవ్యనుపదం సురథః సమాధిః ।
ద్వావప్యవాపతురభీష్టమనన్యలభ్యం
తామాదిదేవతరుణీం ప్రణమామి (మూర్ధ్నా) దేవీమ్ ॥ 8

శ్లో॥ మాహిష్మతీతనుభవఞ్చ రురుఞ్చ హన్తు-
మావిష్కృతైర్నిజరసాదవతారభేదైః ।
అష్టాదశాహత-నవాహత-కోటిసంఖ్యైర్
అమ్బా సదా సమభిరక్షతు మాం విపద్భ్యః ॥ 9

శ్లో॥ ఏతచ్చరిత్రమఖిలం లిఖితం హి యస్యా-
స్సమ్పూజితం సదన ఏవ నివేశితం వా ।
దుర్గం చ తారయతి దుస్తరమప్యశేషం
శ్రేయః ప్రయచ్ఛతి చ సర్వముమాం భజే తామ్ ॥ 10

శ్లో॥ యత్పూజన-స్తుతి-నమస్కృతిభిర్భవన్తి
ప్రీతాః పితామహ-రమేశ-హరాస్త్రయోఽపి ।
తేషామపి స్వకగుణైర్దదతీ వపూంషి
తామీశ్వరస్య తరుణీం శరణం ప్రపద్యే ॥ 11

శ్లో॥ కాన్తారమధ్యదృఢలగ్నతయాఽవసన్నా
మగ్నాశ్చ వారిధిజలే రిపుభిశ్చ రుద్ధాః ।
యస్యాః ప్రపద్య చరణౌ విపదస్తరన్తి
సా మే సదాఽస్తు హృది సర్వజగత్సవిత్రీ ॥ 12

శ్లో॥ బన్ధే వధే మహతి మృత్యుభయే ప్రసక్తే
చి(వి)త్తక్షయే చ వివిధే చ మహోపతాపే ।
యత్పాదపూజనమిహ ప్రతికారమాహు-
స్సా మే సమస్తజననీ శరణం భవానీ ॥ 13

శ్లో॥ బాణాసురప్రహితపన్నగబన్ధమోక్ష-
స్తద్బాహుదర్పదలనాదుషయా చ యోగః ।
ప్రాద్యుమ్నినా ద్రుతమలభ్యత యత్ప్రసాదాత్
సా మే శివా సకలమప్యశుభం క్షిణోతు ॥ 14

శ్లో॥ పాపః పులస్త్యతనయః పునరుత్థితో మా-
మద్యాపి హర్తుమయమాగత ఇత్యుదీతమ్ ।
యత్సేవనేన భయమిన్దిరయాఽవధూతం
తామాదిదేవతరుణీం శరణం గతోఽస్మి ॥ 15

శ్లో॥ యద్ధ్యానజం సుఖమవాప్యమనన్తపుణ్యై-
స్సాక్షాత్తమచ్యుతపరిగ్రహమాశ్వవాపుః ।
గోపాఙ్గనాః కిల యదర్చనపుణ్యమాత్రా-
స్సా మే సదా భగవతీ భవతు ప్రసన్నా ॥ 16

శ్లో॥ రాత్రిం ప్రపద్య ఇతి మన్త్రవిదః ప్రపన్నా-
నుద్బోధ్య మృత్యువధిమన్యఫలైః ప్రలోభ్య ।
బద్ధ్వా చ తద్విముఖతాం ప్రతనం నయన్తీ-
మాకాశమాదిజననీం జగతాం భజే తామ్ ॥ 17

శ్లో॥ దేశకాలేషు దుష్టేషు దేవీచన్ద్రకలాస్తుతిః ।
సన్ధ్యయోరనుసన్ధేయా సర్వాపద్వినివృత్తయే ॥ 18

ఇతి శ్రీమదప్పయ్యదీక్షితవిరచితా దుర్గాచన్ద్రకలాస్తుతిః పూర్ణా ॥

శ్రీః



శ్రీః

శ్రీహయవదనపరబ్రహ్మణే నమః

శ్రీమదప్పయ్యదీక్షితవిరచితా

# దుర్గాచన్ద్రకలాస్తుతిః

వ్యాఖ్యాత - డా॥ ముళ్లపూడి విశ్వనాథశాస్త్రి

శ్లో॥ వేధోహరీశ్వరస్తుత్యాం విహర్త్రీం విన్ధ్యభూధరే ।
హరప్రాణేశ్వరీం వన్దే హన్త్రీం విబుధవిద్విషామ్ ॥ 1

**ప్రతిపదార్థము :** వేధోహరీశ్వరస్తుత్యామ్ = బ్రహ్మవిష్ణుమహేశ్వరులచే సైతము స్తోత్రము చేయబడినదియును, వింధ్యభూధరే = వింధ్యపర్వతప్రాన్తమునందు, విహర్త్రీమ్ = విహరించునదియును; హరప్రాణేశ్వరీమ్ = పరమేశ్వరుని భార్యయును; విబుధ-విద్విషామ్ = దేవతలను ద్వేషించు రాక్షసులను, హన్త్రీమ్ = వధించునదియును, అగు పార్వతీదేవిని, వన్దే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** దేవీమాహాత్మ్యము నందు పరమేశ్వరుని భార్యయగు పార్వతీ దేవి బ్రహ్మదేవునిచే స్తుతింపబడిన గాథ కలదు. అట్లే, హరివంశమునందు హరి దేవిని స్తుతించెను. వరాహపురాణమునందు ఈశ్వరునిచే అమ్మవారు స్తుతింపబడినది. ఇట్లు బ్రహ్మవిష్ణుమహేశ్వరులచే సైతము స్తోత్రము చేయబడిన అమ్మవారు వింధ్యపర్వత ప్రాన్తము నందు విహరించును. దేవతలను ద్వేషించు రాక్షసులను సంహరించును. అట్టి పార్వతీదేవిని నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ అభ్యర్థనేన సరసీరుహసమ్భవస్య
త్యక్త్వోదితా భగవదక్షిపిధానలీలామ్ ।
విశ్వేశ్వరీ విపదపాగమనే పురస్తా-
న్మాతా మమాస్తు మధుకైటభయోర్నిహన్త్రీ ॥ 2

ప్ర : సరసీరుహసంభవస్య = పద్మసంభవుడగు బ్రహ్మదేవునియొక్క, అభ్యర్థనేన = ప్రార్థనచే,

భగవదక్షిపిధానలీలామ్ = భగవంతుడగు హరియొక్క నేత్రములను మూయుట అను క్రీడను, త్యక్త్వా = విడచిపెట్టి, ఉదితా = ఆవిర్భవించినదియును; మధుకైటభయోః = మధు, కైటభుడు అను ఇరువురు రాక్షసులను, నిహన్త్రీ = చంపినటువంటిదియును; మాతా = నాకు తల్లి అయినదియును, అగు, విశ్వేశ్వరీ = **విశ్వేశ్వరీ** అను పేరుగల దేవి, మమ = నా యొక్క, విపదపాగమనే = ఆపదలను పోగొట్టుట యందు; పురస్తాత్ = ఎట్టఎదుటగా, అస్తు = ఉండుగాక!

**తా :** ఈ శ్లోకమునందు దేవీమాహాత్మ్యమును ప్రతిపాదించు **సప్తశతీ** అను గ్రంథము నందలి ప్రథమాధ్యాయసారము సంగ్రహముగ చెప్పబడినది.

ఒకప్పుడు పాలసముద్రములో విష్ణువు యోగనిద్రలో ఉండెను. యోగనిద్ర అనగా నిజమైన నిద్రకాదు. ఆటలకొరకు పిల్లల కనులను మరియొకరు మూసినట్లు విష్ణుమూర్తి కనులను అమ్మవారు క్రీడ కొరకు మూయును. దీనినే యోగనిద్ర అందురు. ఆ సమయములో విష్ణువు చెవులలోని గువిలినుండి మధువు, కైటభుడు అను ఇరువురు రాక్షసులు పుట్టి బ్రహ్మను చంపుటకు సిద్ధము కాగా, అప్పుడు బ్రహ్మదేవుడు దేవిని స్తోత్రము చేసి విష్ణువును యోగనిద్రనుండి మేల్కొలుపుము అనియు, ఈ రాక్షసులను చంపుటకు ఆయనకు భావము కలుగజేయుమని ప్రార్థింపగా ఆమె విష్ణుమూర్తి కన్నులనుండి లేచి బ్రహ్మదేవునకు ప్రత్యక్షమై విష్ణుమూర్తికి మధుకైటభులను చంపుటకు భావమును కలుగజేసెను. ఈ విధముగ మధుకైటభులను చంపుటకు కారణమైన ఆ విశ్వేశ్వరీ మాత నాయొక్క ఆపదలను పోగొట్టు విషయములో నాకు ముందు ఉండుగాక!

**విశేషములు :** 1. మధు కైటభులను చంపినది విష్ణుమూర్తియే అయినను, అట్లు చంపుటకు వీలైన బోధ చేసినది అమ్మవారే కాన అమ్మవారే మధుకైటభులను చంపినట్లుగ మనము భావించవలెను.

2. ఎప్పుడైనను ఏ దేవత ఏ రాక్షసుని సంహరించినను ఆ దేవతకు ఆ రాక్షసుని సంహరింప వలెనను జ్ఞానమును అమ్మవారే కలుగ జేయునుగాన సకల రాక్షసులను సంహరించునది అమ్మవారే అని తెలిసికొనవలెను.

3. ఈ విషయమును బ్రహ్మదేవుడు చేసిన స్తోత్రములో స్వయముగ బ్రహ్మదేవుడే తెలిపెను. “**బోధశ్చ క్రియతామస్య హన్తుమేతౌ మహాసురౌ**” అను శ్లోకములో ఈ మధుకైటభులను సంహరించు భావము విష్ణుమూర్తికి కలుగజేయవలసినదిగా బ్రహ్మ అమ్మవారిని ప్రార్థించెను.

4. కనుకనే మనకు ఏ దేవత వలన ఏ కోరిక తీరినను దానికంతటికి కారణము అమ్మవారే అని భావించవలెను. అందువలననే భాగవతములో రుక్మిణీదేవి కూడ శ్రీకృష్ణుడు వచ్చి తనను పెండ్లిచేసికొను భావము అతనికి కలుగజేయుటకై అమ్మవారిని ప్రార్థించెను.

**శ్లో॥ ప్రాక్నిర్జరేషు నిహితైర్నిజశక్తిలేశైర్**
**ఏకీభవద్భిరుదితాఽఖిలలోకగుప్త్యై ।**
**సమ్పన్నశస్త్రనికరా చ తదాయుధస్థైర్**
**మాతా మమాస్తు మహిషాన్తకరీ పురస్తాత్ ॥ 3**

దేవీమాహాత్మ్యమును ప్రతిపాదించు **సప్తశతీ** అను గ్రంథములో 13 అధ్యాయములు కలవు. అందు మొదటి అధ్యాయమును ప్రథమచరిత్ర అనియు, 2,3,4 అధ్యాయములను మధ్యమచరిత్ర అనియు, 5 నుండి 13 వరకు గల తొమ్మిది అధ్యాయములను ఉత్తర చరిత్ర అని అందురు. ఈ శ్లోకమునందు **మధ్యమచరిత్ర** సంగ్రహముగ ప్రతిపాదించబడినది.

**ప్ర :** నిర్జరేషు = దేవతలయందు, ప్రాక్ = ఇంతకుముందే, నిహితైః = ఉంచబడినవియును, అఖిలలోకగుప్త్యై = సమస్తలోకములను రక్షించుట కొరకు, ఏకీభవద్భిః = (అనంతరము) ఒకటిగా మారినటువంటివియును, అగు, నిజశక్తిలేశైః = తన శక్తుల భాగములతో, తదాయుధస్థైః = ఆ దేవతల ఆయుధములయందు గల శక్తులతో, సంపన్నశస్త్రనికరా చ = సమకూరిన ఆయుధసమూహము కలదియును అగు, మహిషాన్తకరీ = మహిషాసురుని చంపిన, మాతా = తల్లియగు ఆ పార్వతీదేవి, మమ = నా యొక్క, పురస్తాత్ = ఎట్ట ఎదుటగా, అస్తు = ఉండుగాక!

**తా :** పూర్వము మహిషాసురునిచే బాధింపబడిన దేవతలు బ్రహ్మదేవుని ముందుగా పెట్టుకొని తమ బాధలు చెప్పికొనుటకు విష్ణు, రుద్రులవద్దకు వెళ్ళి తమ బాధ చెప్పికొనగా అప్పుడు బాగుగ కోపించిన త్రిమూర్తుల నుండియు, ఇతర దేవతలనుండియు కొంత కొంత తేజస్సులు రాగా, ఆ తేజస్సులు అన్నియును కలిసి ఒక స్త్రీమూర్తిగా మారెను. ఆవిడయే దేవి. ఆ దేవికి దేవతలు అందరు తమతమ ఆయుధములను ఇచ్చిరి. ఈ విధముగ సమస్త ఆయుధములతో కూడిన ఆ దేవి మహిషాసురుని సంహరించెను. అని మధ్యమ చరిత్ర సారాంశము.

ఈ కథలో సకల దేవతల తేజస్సులచే దేవి ఏర్పడినట్లుగా కలదు. వాస్తవమునకు ఆ దేవియే తన శక్తులను ఇంతకు ముందు ఆ దేవతలయందు ఉంచినది. అట్లే తన

ఆయుధములనే ఒక్కొక్క దేవత యందు విడివిడిగా ఉంచినది. మహిషాసురవధ సమయమున తాను తీసికొనినది. ఈ జగత్తునందు ఆమె కానిది ఏమియు లేదు. ఆమెది కానిది ఏదియును లేదు. అట్టి ఆ దేవి సర్వదా నా ఎదుట ఉండి నన్ను రక్షించుగాక!

**శ్లో॥ ప్రాలేయశైలతనయాతనుకాన్తిసమ్పత్-**
**కోశోదితా కువలయచ్ఛవిచారుదేహా ।**
**నారాయణీ నమదభీప్సితకల్పవల్లీ**
**సుప్రీతిమావహతు శుమ్భనిశుమ్భహన్త్రీ ॥ 4**

ఈ శ్లోకములో దేవీమాహాత్మ్యమును ప్రతిపాదించు **సప్తశతీ** అను గ్రంథములోని 5 మరియు 6 అధ్యాయములలోగల శుంభ నిశుంభవధకు సంబంధించిన గాథ సంగ్రహముగ చెప్పబడినది.

**ప్ర :** ప్రాలేయశైల = హిమవత్పర్వతముయొక్క, తనయా = కూతురు అయిన పార్వతియొక్క, తనుకాన్తిసంపత్కోశ = శరీరకాన్తిసంపద అను కోశమునుండి, ఉదితా = ఆవిర్భవించి నటువంటిదియును; కువలయ = నల్లని కలువపూవుయొక్క, ఛవి = కాన్తివంటి కాన్తితో, చారు = సున్దరమైన, దేహా = శరీరము కలదియును; శుంభనిశుంభహన్త్రీ = శుంభుడు, నిశుంభుడు అను రాక్షసులను సంహరించినదియును; నమదభీప్సితకల్పవల్లీ = నమస్కరించిన వారి కోర్కెలను తీర్చుటలో కల్పలత వంటిదియును; నారాయణీ = నారాయణి అను పేరుగలదియును అగు ఆ కౌశికీదేవి, సుప్రీతిమ్ = మాకు గొప్ప ఆనందమును, ఆవహతు = కలుగజేయుగాక!

ఒకప్పుడు శుంభుడు, నిశుంభుడు అను రాక్షసుల వలన బాధలను భరించలేని దేవతలు హిమవత్పర్వత ప్రాంతమునకు వెళ్లి పార్వతిని ప్రార్థించుచుండగా అచటికి పార్వతి వచ్చి ఓ దేవతలారా! మీరు ఎవరిని స్తోత్రము చేయుచున్నారని అడుగగా, ఆమె శరీరమునుండి ఒక నల్లకలువ వంటి కాన్తితో ఒక కన్యక కౌశికీ (కాళీ) ఉద్భవించి వీరు నన్నే స్తోత్రము చేయుచున్నారని తెలిపెను. అనంతరము ఆమెయే శుంభ నిశుంభులను సంహరించెను. పార్వతీదేహమునుండి కౌశికీ (కాళీ) బయటకు రాగా మిగిలిన దేహము గౌరవర్ణము కలిగియుండుటచే ఆ శరీరముతో ఆమె గౌరి ఆయెను.

ఈ విధముగ శుంభ నిశుంభులను వధించి దేవతలకు ఆనందము కలిగించిన ఆ కౌశికీదేవి తనను నమస్కరించు వారలకు కల్పలత వలె సమస్త కోర్కెలను తీర్చును. అట్టి తల్లి నాకు గొప్ప ఆనందమును (మోక్షమును) కలుగజేయుగాక!

**శ్లో॥ విశ్వేశ్వరీతి మహిషాన్తకరీతి యస్యా**
**నారాయణీత్యపి చ నామభిరఙ్కితాని ।**
**సూక్తాని పఙ్కజభువా చ సురర్షిభిశ్చ**
**దృష్టాని పావకముఖైశ్చ శివాం భజే తామ్ ॥ 5**

**ప్ర :** విశ్వేశ్వరీ ఇతి = విశ్వేశ్వరి అనియు, మహిషాన్తకరీ ఇతి = మహిషాన్తకరి అనియు, నారాయణీ ఇతి అపి చ = నారాయణి అనియు కూడ, యస్యాః = ఏ పార్వతీదేవి యొక్క, నామభిః = పేరులతో, అంకితాని = చిహ్నితములయిన, సూక్తాని = సూక్తములు, పంకజభువా = బ్రహ్మదేవుని చేత, సురర్షిభిశ్చ = దేవఋషులచేత, పావకముఖైశ్చ = అగ్నిమొదలైన వారిచేత, దృష్టాని = చూడబడినవో, తామ్ = అట్టి, శివామ్ = పార్వతిని, భజే = సేవించుచున్నాను.

**తా :** దేవీ మాహాత్మ్యమును ప్రతిపాదించు **సప్తశతీ గ్రంథము** నందు మొదటి అధ్యాయమున బ్రహ్మచే చేయబడిన స్తోత్రము కలదు. ఆ స్తోత్రము **విశ్వేశ్వరీ** అను పదముతో ప్రారంభించ బడినది. నాలుగవ అధ్యాయమునందు మహిషాసురవధానన్తరము మహిషాన్తకరీ అనుపేరుతో దేవఋషులచేత చేయబడిన స్తోత్రము కలదు. పదకొండవ అధ్యాయము నందు శుంభ వధానన్తరము వహ్నిమొదలగు దేవతలచే చేయబడిన స్తోత్రము నారాయణీ అను పేరుతో కలదు. ఈ విధముగా ఈ మూడు స్తోత్రములతో స్తుతించబడిన పార్వతిని నేను సేవించుచున్నాను.

**వి :** ఈ మూడు స్తోత్రములు బ్రహ్మచేత, దేవఋషులచేత, మరియు వహ్నిమున్నగువారిచే చేయబడినట్లుగ పైకి కనబడుచున్నను అవి వారిచే చేయబడినవి కాదనియు, ఆ స్తోత్రములు వేదములతో సమానమైనవి, నిత్యములు, ఎప్పటి నుండియో ఉన్నవియే అనియు సూచించుటకు అప్పయ్యదీక్షితుల వారు "దృష్టాని" అని అనిరి. అనగా వారిచేత చూడబడిన స్తోత్రములే కాని వారు స్వయముగా చేసినవి కాదని సారాంశము. కాన ఆ స్తోత్రములు వేదములతో సమానమైనవి. పరమపవిత్రమైనవి. ఆ స్తోత్రములతో అమ్మవారిని ప్రార్థించు వారలకు సకలములైన అభీష్టములు నెరవేరును.

**శ్లో॥ ఉత్పత్తి-దైత్యహనన-స్తవనాత్మకాని**
**సంరక్షకాణ్యఖిలభూతహితాయ యస్యాః ।**
**సూక్తాన్యశేషనిగమాన్తవిదః పఠన్తి**
**తాం విశ్వమాతరమజస్రమభిష్టవీమి ॥ 6**

**ప్ర :** యస్యాః = ఏ దేవియొక్క, ఉత్పత్తి, దైత్యహనన, స్తవనాత్మకాని = పుట్టుక, రాక్షసులను చంపుట, స్తోత్రము ఈ మూడును స్వరూపముగా కలవియును, సంరక్షకాణి = ప్రాణులను రక్షించునవియును అగు, సూక్తాని = సూక్తములు (గాథలు), అశేషనిగమాన్తవిదః = సకల వేదాన్తములు తెలిసినవారు, అఖిలభూతహితాయ = సకల ప్రాణుల క్షేమము కొరకై, పఠన్తి = చదివెదరో (పారాయణ చేసెదరో), తామ్ = అట్టి, విశ్వమాతరమ్ = జగజ్జనని యగు దేవిని, అజస్రమ్ = ఎల్లప్పుడు, అభి–ష్టవీమి = స్తుతించెదను.

**తా :** దేవీమాహాత్మ్యమును ప్రతిపాదించు **సప్తశతీ గ్రంథము** నందు ప్రథమ చరిత్ర, మధ్యమచరిత్ర, ఉత్తరచరిత్రలు కలవు. ఇందు ప్రతిచరిత్రయందును మూడు భాగములు కలవు. అవి 1. అమ్మవారు పుట్టుట, 2. అమ్మవారు రాక్షసులను చంపుట, 3. అమ్మవారిని స్తోత్రము చేయుట. ఇందులోని భాగమును పారాయణము చేసినను జనులకు మేలు కలుగును.

అందువలననే వేదవేదాన్తతత్త్వజ్ఞులు సైతము లోకహితము కొరకై దేవీమాహాత్మ్యమును చదువుదురు. జగజ్జనని యగు ఆ తల్లిని నిరన్తరము స్తుతించెదను.

**శ్లో॥ యే వైప్రచిత్త–పునరుత్థిత–శుమ్భముఖ్యైర్**
**దుర్భిక్షఘోరసమయేన చ కారితాసు ।**
**ఆవిష్కృతాస్త్రిజగదార్తిషు రూపభేదా–**
**స్తైరమ్బికా సమభిరక్షతు మాం విపద్భ్యః ॥ 7**

**ప్ర :** వైప్రచిత్త పునరుత్థిత శుంభముఖ్యైః : వైప్రచిత్త = విప్రచిత్తి అను దానవుని సంతానము, పునరుత్థిత = మరల పుట్టిన, శుంభ = శుంభాసురుడు, ముఖ్యైః = మొదలుగాకల రాక్షసులచేత, దుర్భిక్షఘోరసమయేన చ = కరవు, ఘోరములు మున్నగువానిచే, త్రిజగదార్తిషు = ముల్లోకములలోని బాధలు, కారితాసు = చేయించబడగా, యే = ఎటువంటి, రూపభేదాః = పలురకములైన రూపములు, ఆవిష్కృతాః = (అంబికచేత) ఆవిష్కరింపబడినవో, తైః = ఆ రూపములన్నింటితోను, అంబికా = అంబికా దేవి, మామ్ = నన్ను, విపద్భ్యః = ఆపదలనుండి, సమభిరక్షతు = రక్షించుగాక!

**తా :** దేవీమాహాత్మ్యము నందు నారాయణీ స్తోత్రము ద్వారా వహ్న్యాది దేవతలచే స్తుతింపబడిన అంబికాదేవి సంతసించినదియై వారితో "భవిష్యత్ కాలములో శుంభనిశుంభులు మరల పుట్టగలరు. అట్లే వైప్రచిత్తులు అను దానవులు పుట్టగలరు. ఇట్టి దానవులు కరవు

కాటకములు, ఘోరములు సృష్టించెదరు. అందువలన ముల్లోకములకు బాధలు కలుగును. అప్పుడు కూడ నేను '**నందా, రక్తదన్తా, భ్రామరీ, శాకంబరీ, భీమా, దుర్గా**' మొదలుగా కల పలురకములగు రూపములను ధరించి ముల్లోకముల బాధలు పోగొట్టగలను" అని పలికెను.

ఈ విధముగా దేవి సకల విధములైన రూపములతో ఆపదలనుండి నన్ను రక్షించుగాక!!

**శ్లో॥ సూక్తం యదీయమరవిన్దభవాది దృష్ట-**
**మావర్త్య దేవ్యనుపదం సురథః సమాధిః ।**
**ద్వావప్యవాపతురభీష్టమనన్యలభ్యం**
**తామాదిదేవతరుణీం ప్రణమామి దేవీమ్ (మూర్ధ్నా) ॥ 8**

**ప్ర :** అరవింద భవాది దృష్టమ్ = బ్రహ్మాది దేవతలచే చూడబడిన (చేయబడిన), యదీయమ్ = ఏ పార్వతీ దేవికి సంబంధించిన, దేవ్యనుపదమ్ = "నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః" అను దేవీపదముతో అంకితమైన, సూక్తమ్ = దేవీ సూక్తమును, ఆవర్త్య = జపించి, సురథః = సురథుడు, సమాధిః = సమాధి, ద్వావపి = ఇద్దరును, అనన్యలభ్యమ్ = ఇతరులచే పొందుటకు శక్యము కాని, అభీష్టమ్ = కామితమును, అవాపతుః = పొందిరో, తామ్ = అటువంటి, ఆదిదేవతరుణీమ్ = శివుని భార్యయగు పార్వతిని, మూర్ధ్నా = శిరస్సుతో, ప్రణమామి = నమస్కరించుచున్నాను.

**తా :** సురథుడు అనురాజు, సమాధి అను వైశ్యుడు ఇరువురును బ్రహ్మాది దేవతలచే చెప్పబడిన స్తోత్రములను నిరన్తరము భక్తిశ్రద్ధలతో పఠించి ఇతరులకు సాధ్యముకాని వారి కోరికలను పొందిరి. అట్టి పార్వతీ దేవిని నేను శిరసు వంచి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ మాహిష్మతీతనుభవఞ్చ రురుఞ్చ హన్తు-**
**మావిష్కృతైర్నిజరసాదవతారభేదైః ।**
**అష్టాదశాహత-నవాహత-కోటిసంఖ్యైర్**
**అమ్బా సదా సమభిరక్షతు మాం విపద్భ్యః ॥ 9**

**ప్ర :** మాహిష్మతీ తనుభవమ్ = మాహిష్మతి యొక్క కుమారుడైన, మహిషాసురుని, రురుమ్ = రురువు అను పేరుగల వానిని, హంతుమ్ = చంపుటకు, నిజరసాత్ = తన శక్తి నుండి, ఆవిష్కృతైః = ఆవిష్కరింపబడిన, అష్టాదశ+ఆహతకోటిసంఖ్యైః = 18 కోట్ల సంఖ్య కలిగిన, నవ+ఆహత కోటి సంఖ్యైః = 9 కోట్ల సంఖ్య గలిగిన, అవతారభేదైః = అవతారములతో, అంబా = తల్లియగు పార్వతీదేవి, మామ్ = నన్ను, విపద్భ్యః = ఆపదల నుండి, సదా = ఎల్లప్పుడూ, సమభిరక్షతు = సంరక్షించుగాక!

**తా :** పూర్వము పార్వతీదేవి మహిష్మతి అను రాక్షసి కుమారులైన మహిషాసురుని, రురువును సంహరించెను. ఆ సంహార సమయములో మహిషాసురుని సంహరించు సందర్భములో తన శరీరమునుండి 18 కోట్ల సంఖ్య కలిగిన అవతారములను ఆవిర్భవింప చేసి వారితో మహిషాసురుని సంహరించెను. రురువును సంహరించు సందర్భములో 9 కోట్ల అవతారములను ఆవిర్భవింపజేసెను. ఆ 18 కోట్లు + 9 కోట్లు అవతారములతో పార్వతీదేవి నన్ను ఆపదలనుండి రక్షించుగాక!

**శ్లో॥ ఏతచ్చరిత్రమఖిలం లిఖితం హి యస్యా-**
**స్సమ్పూజితం సదన ఏవ నివేశితం వా ।**
**దుర్గఞ్చ తారయతి దుస్తరమప్యశేషం**
**శ్రేయః ప్రయచ్ఛతి చ సర్వముమాం భజే తామ్ ॥ 10**

**ప్ర :** యస్యాః = ఏ త్రిశక్తియొక్క, లిఖితమ్ = వ్రాయబడిన, అఖిలమ్ = సమస్తమైన, ఏతత్ చరిత్రమ్ = ఈ చరిత్ర, సంపూజితమ్ = పూజించబడునో, సదనే = గృహమునందు, నివేశితమేవ వా = ఉంచుకొనబడినదో, అట్టివారియొక్క అశేషమ్ = సమస్తమగు, దుస్తరమ్ = దాటుటకు శక్యముకాని, దుర్గమ్ = దుఃఖములను, తారయతి = దాటించును, శ్రేయః = శ్రేయస్సును, ప్రయచ్ఛతి = ఇచ్చును. తామ్ = అట్టి, ఉమామ్ = పార్వతిని, భజే = సేవింతును.

**తా : వరాహపురాణము నందలి కథ.** ఒకప్పుడు కైలాసమునందు శివుడు సభలో ఉండగా బ్రహ్మ వచ్చి రాక్షసుల వలని బాధను వివరించెను. అప్పుడే నారాయణుడు కూడా అచటకు వచ్చెను. వారు అన్యోన్యముగా ఒకరినొకరు చూసికొనుచుండగా ఆ ముగ్గురి చూపుల కలయికతో ఒకానొక కన్యక పుట్టెను. ఆమె త్రిమూర్తుల ఆజ్ఞానుసారముగ మూడు శరీరములతో విభక్తమైనది. ఒక శరీరమునందు బ్రహ్మయొక్క సాత్త్విక శక్తి, మరియొక శరీరమునందు విష్ణువుయొక్క రాజస శక్తి, మూడవశరీరమునందు పరమేశ్వరుని తామసశక్తి ప్రవేశించెను.

ఈ విధముగ ఆవిర్భవించిన త్రిశక్తియగు పార్వతి చరిత్ర వ్రాయబడిన గ్రంథము ఏ ఇంటిలో పూజింపబడునో, కనీసము ఏ ఇంటిలో ఉండునో అట్టివారి సమస్త దుఃఖములను ఆమె పోగొట్టి, సకల విధములగు శ్రేయస్సులను ఆమె వారికి నొసంగును. అట్టి పార్వతిని నేను సేవించుచున్నాను.

శ్లో॥ యత్పూజనస్తుతినమస్కృతిభిర్భవన్తి
ప్రీతాః పితామహ-రమేశ-హరాస్త్రయోఽపి ।
తేషామపి స్వకగుణైర్దదతీ వపూంషి
తామీశ్వరస్య తరుణీం శరణం ప్రపద్యే ॥ 11

ప్ర : యత్ = ఏ త్రిశక్తి యొక్క, పూజన = పూజించుట, స్తుతి = స్తోత్రము చేయుట, నమస్కృతిభిః = నమస్కారములు చేయుటలతో, పితామహ-రమేశ-హరాః = బ్రహ్మవిష్ణు మహేశ్వరులు, త్రయోఽపి = ముగ్గురును, ప్రీతాః = సంతసించిన వారుగ, భవన్తి = అగుదురో!, తేషామపి = పూజాస్తుతి నమస్కారములు చేసిన వారికి సైతము, స్వకగుణైః = తమ సత్త్వరజస్తమోగుణములతో, వపూంషి = శరీరములను, దదతీ = ఇచ్చునో, తామ్ = అట్టి, ఈశ్వరస్య తరుణీమ్ = శివుని ఇల్లాలు అగు పార్వతిని, శరణమ్ = శరణముగా, ప్రపద్యే = పొందెదను.

తా : త్రిశక్తి అగు పార్వతీదేవిని పూజించిననూ, స్తోత్రము చేసినను, నమస్కరించినను పార్వతీదేవి ప్రీతురాలు అగుట మాత్రమే గాదు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సైతము సంతసించెదరు. అట్లే, ఆ పార్వతి పూజా-స్తుతి-నమస్కారములు చేయు భక్తునకు తనకు వలెనే సత్త్వరజస్తమో రూపములతో శరీరమును ఇచ్చును. అనగా తన సాయుజ్యమును ఇచ్చును. అట్టి పార్వతిని నేను శరణు వేడుచున్నాను.

శ్లో॥ కాన్తారమధ్యదృఢలగ్నతయాఽవసన్నా
మగ్నాశ్చ వారిధిజలే రిపుభిశ్చ రుద్ధాః ।
యస్యాః ప్రపద్య చరణౌ విపదస్తరన్తి
సా మే సదాఽస్తు హృది సర్వజగత్సవిత్రీ ॥ 12

ప్ర : యస్యాః = ఏ దేవి యొక్క, చరణౌ = పాదములను, ప్రపద్య = శరణు పొంది, కాన్తారమధ్యదృఢలగ్నతయా = అడవి మధ్యలో బాగుగ చిక్కుకొనుటచే, అవసన్నాః = దుఃఖితులును, వారిధిజలే = సముద్రజలమునందు, మగ్నాః = మునిగిన వారును, రిపుభిః = శత్రువులచేత, రుద్ధాశ్చ = అడ్డగింపబడిన వారును, విపదః = ఆపదలను, తరన్తి = దాటుదురో, సర్వజగత్సవిత్రీ = సమస్త ప్రాణులకు తల్లి అయిన, సా = ఆ దేవి, మే = నా యొక్క, హృది = హృదయము నందు, సదా = ఎల్లప్పుడు, అస్తు = ఉండుగాక!

తా : అడవి మధ్యలో చిక్కుపడి బయటకు వచ్చు మార్గము కానక దుఃఖించువారును,

సముద్రము మధ్యలో మునిగిన వారును, శత్రువులచే ఆక్రమింప బడిన వారును ఏ దేవి యొక్క పాదపద్మములను శరణుపొంది సమస్తదుఃఖములను దాటెదరో అట్టి తల్లి నా హృదయమునందు ఎల్లప్పుడు ఉండుగాక!

**శ్లో॥ బన్ధే వధే మహతి మృత్యుభయే ప్రసక్తే**
**చి(వి)త్తక్షయే చ వివిధే చ మహోపతాపే ।**
**యత్పాదపూజనమిహ ప్రతికారమాహు-**
**స్సా మే సమస్తజననీ శరణం భవానీ ॥** **13**

**ప్ర :** బన్ధే = బన్ధనము, వధే = వధ, మృత్యుభయే = మరణభీతి, చిత్తక్షయే = మనోవ్యాధి, వివిధే = పలురకములయిన, మహోపతాపే = మహోత్పాతములు, ప్రసక్తే = సంభవించినప్పుడు, యత్పాదపూజనమ్ = ఏ పార్వతీదేవియొక్క పాదములను పూజించుటయే, ప్రతికారమ్ = నివారణోపాయముగా, ఆహుః = (పెద్దలు) చెప్పిరో, సమస్త జననీ = జగజ్జనని యగు, సా భవానీ = అట్టి పార్వతి, మే = నాకు, శరణమ్ = దిక్కు (అగుగాక!)

**తా :** బన్ధనము, మరణము, మరణభీతి, పెద్దవి చిన్నవియగు ఉత్పాతములు సంభవించినప్పుడు వానికి నివారణోపాయముగా పార్వతీదేవిని పూజించవలెను. ( ఈ విషయము **హరివంశము** అను గ్రంథములో పార్వతీదేవిని గురించి భగవంతుడే స్వయముగ చెప్పెను. ) కాన అట్టి పార్వతీదేవినే నేను సర్వదా శరణు పొందెదను.

**శ్లో॥ బాణాసురప్రహితపన్నగబన్ధమోక్ష-**
**స్తద్బాహుదర్పదలనాదుషయా చ యోగః ।**
**ప్రాద్యుమ్నినా ద్రుతమలభ్యత యత్ప్రసాదాత్**
**సా మే శివా సకలమప్యశుభం క్షిణోతు ॥** **14**

**ప్ర :** యత్ప్రసాదాత్ = ఏ పార్వతీదేవి అనుగ్రహము వలన, ప్రాద్యుమ్నినా = ప్రద్యుమ్నుని కుమారుడగు అనిరుద్ధునిచేత, బాణాసురప్రహితపన్నగబన్ధమోక్షః = బాణాసురునిచే ప్రయోగించబడిన నాగపాశ విమోక్షణము, తద్బాహుదర్పదలనాత్ = బాణాసురుని భుజబల గర్వమును అణచుటచే, ఉషయా = ఉషతో, యోగః చ = సమాగమమున్ను, ద్రుతమ్ = వేగముగా, అలభ్యత = పొందబడెనో, సా శివా = ఆ పార్వతీదేవియే, మే = నా యొక్క, సకలమపి = సమస్తమగు, అశుభమ్ = అమంగళమును, క్షిణోతు = నశింపజేయుగాక.

**తా : హరివంశము** అను గ్రంథమునందు అనిరుద్ధుని పార్వతీదేవి రక్షించు గాథ ఈ శ్లోకమునందు సంగ్రహముగా వివరింపబడినది.

శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు. ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు, అనిరుద్ధుని బాణాసురుని కూతురు ఉష ప్రేమించెను. యుద్ధమునందు బాణాసురుడు నాగపాశముతో అనిరుద్ధుని బంధింపగా నారదుడచటకు వచ్చి అనిరుద్ధుని ఓదార్చి ఆ విషయమును శ్రీకృష్ణునికి తెలిపెను. అనిరుద్ధుడును పార్వతీదేవిని స్తోత్రము చేసి ఆత్మరక్షణకై ప్రార్థించెను. పార్వతీదేవి ప్రేరణ వలన శ్రీకృష్ణుడు అనిరుద్ధుని నాగపాశము నుండి విముక్తుని చేసెను.

ఏ పార్వతీదేవి అనుగ్రహముతో అనిరుద్ధునకు బాణాసురునితో ప్రయోగింపబడిన నాగపాశము నుండి మోక్షము లభించినదో, ఎవరి అనుగ్రహముతో బాణాసురుని బాహుదర్పము అణచబడగా బాణాసురుని కూతురు అగు ఉషతో అనిరుద్ధునకు వివాహము జరిగినదో, అట్టి పార్వతీదేవి నా యొక్క సకల విధములైన అశుభములను నాశనము చేయుగాక!

**శ్లో॥ పాపః పులస్త్యతనయః పునరుత్థితో మా-**
**మద్యాపి హర్తుమయమాగత ఇత్యుదీతమ్ ।**
**యత్సేవనేన భయమిన్దిరయాఽవధూతం**
**తామాదిదేవతరుణీం శరణం గతోఽస్మి ॥ 15**

**ప్ర : భాగవతము**లో రుక్మిణీదేవి గాథ ఇందు సంగ్రహించబడినది.

పాపః = పాపాత్ముడైన, పులస్త్యతనయః = పులస్త్యుని కుమారుడగు రావణాసురుడు, పునః = మరల, ఉత్థితః = ఉద్భవించెను. అద్యాపి = నేడుకూడ (ఈ జన్మలో సైతము), మామ్ = నన్ను, హర్తుమ్ = అపహరించుటకు, అయమ్ = శిశుపాలుని వేషములో నున్న రావణుడు, ఆగతః = వచ్చెను. ఇతి = అని, ఉదీతమ్ = రుక్మిణిచే పలుకబడెను. యత్ సేవనేన = ఏ పార్వతీదేవిని సేవించుటచే, ఇన్దిరయా = లక్ష్మీస్వరూపిణి యగు రుక్మిణిచే, భయమ్ = భయము, అవధూతమ్ = తిరస్కరింపబడెనో, తామ్ = అట్టి, ఆదిదేవతరుణీమ్ = శివుని ఇల్లాలు అగు పార్వతిని, శరణమ్ = శరణముగా, ప్రపద్యే = పొందెదను.

**తా :** పాపాత్ముడైన రావణాసురుడు శిశుపాలుని వేషముతో మరల ఉద్భవించి పూర్వజన్మము నందు వలె నన్ను అపహరించుటకు వచ్చినాడని రుక్మిణి బాధపడి భవానీ(పార్వతీ)దేవిని రక్షించమని ప్రార్థించగా ఆదేవి రుక్మిణిని కాపాడి రక్షించెను. అట్టి దేవిని నేను శరణు పొందు చున్నాను.

శ్లో॥ యద్ధ్యానజం సుఖమవాప్యమనన్తపుణ్యై-
స్సాక్షాత్తమచ్యుతపరిగ్రహమాశ్వవాపుః ।
గోపాఙ్గనాః కిల యదర్చనపుణ్యమాత్రా-
స్సా మే సదా భగవతీ భవతు ప్రసన్నా ॥ 16

ప్ర : శ్రీకృష్ణసమాగమము పొందుటకై గోపికలు దుర్గారూపముతో దేవిని ఆరాధించిరి. ఆ పుణ్యముచేతనే వారు శ్రీకృష్ణుని పొందిరి అను **భాగవత**కథ ఈ శ్లోకమునందు వివరించబడినది.

యదర్చనపుణ్యమాత్రాః = ఏ దుర్గాదేవిని పూజించుట అను పుణ్యము కలవారై, గోపాంగనాః = గోపస్త్రీలు, యద్ధ్యానజమ్ = ఏ శ్రీకృష్ణుని స్మరించుట వలన కలుగు, సుఖమ్ = సుఖము, అనన్తపుణ్యైః = అంతులేని పుణ్యములతో, అవాప్యమ్ = పొందదగినదో, తమ్ = అట్టి, అచ్యుతపరిగ్రహమ్ = అచ్యుతసమాగమమును, సాక్షాత్ = ప్రత్యక్షముగ, ఆశు = శీఘ్రముగా, అవాపుః కిల = పొందినారట!, సా భగవతీ = అట్టి దేవి, సదా = ఎల్లప్పుడు, మే = నాకు, ప్రసన్నా = ప్రసన్నురాలు, భవతు = అగుగాక!

**తా :** శ్రీకృష్ణుని ఒక్కసారి స్మరించుట వలననే ఎంతో ఆనందము లభించును. ఆ స్మరణ సుఖము అంతులేని పుణ్యములు చేసిన వారికి మాత్రమే పొందుటకు సాధ్యమగును. కాని గోపస్త్రీలు ప్రత్యక్షముగ శ్రీకృష్ణునితో సమాగమసుఖమును పొందిరి. ఈ సుఖమును పొందుటకు వారు ఎంత పుణ్యము చేసికొనిరో అని సందేహము కలుగును. వారు దుర్గాదేవీ రూపములో నున్న ఆ పార్వతిని ఒక్కమారు పూజించిరి. ఆ పుణ్యముచేత మాత్రమే శ్రీకృష్ణ సమాగమసౌఖ్యమును పొందిరి.

ఒకసారి పూజచేసిన మాత్రముననే అట్టి అనన్తపుణ్యముల నొసగు ఆ తల్లి నాయెడల సర్వదా ప్రసన్నురాలు అగుగాక!

శ్లో॥ రాత్రిం ప్రపద్య ఇతి మన్త్రవిదః ప్రపన్నా-
నుద్బోధ్య మృత్యవధిమన్యఫలైః ప్రలోభ్య ।
బద్ధ్వా చ తద్విముఖతాం ప్రతనం నయన్తీ-
మాకాశమాదిజననీం జగతాం భజే తామ్ ॥ 17

ప్ర : రాత్రిం ప్రపద్యే ఇతి = "రాత్రిం ప్రపద్యే" మొదలుగా కల, మన్త్రవిదః = రాత్రిసూక్త-మన్త్రములు తెలిసినవారగు, ప్రపన్నాన్ = తనను శరణుజొచ్చిన వారలను, మృత్యవధిమ్

= చావుయొక్క అన్తమును, ఉద్బోధ్య = తెలియజేసి, అన్యఫలైః = ఇతరములైన ఐహిక ఫలములతో, ప్రలోభ్య = లోభపరచి, బద్ధ్వా = బంధించి, ప్రతనం తద్విముఖతామ్ = నెమ్మదిగా ఐహికఫలములయందు విముఖత్వమును, నయన్తీమ్ = పొందించునదియును, ఆకాశమ్ = ఆకాశస్వరూపిణియును అగు, జగతామ్ = సర్వజగత్తులకు, ఆదిజననీమ్ = మొదటితల్లియగు, తామ్ = ఆ పార్వతీదేవిని, భజే = సేవించుచున్నాను.

**తా : రాత్రిసూక్త మహిమ** ఈ శ్లోకమునందు చెప్పబడుచున్నది. "రాత్రిం ప్రపద్యే" అను వచనముతో ప్రారంభమగు రాత్రిసూక్తమును ఎరింగినవారు ఆ సూక్తమును పఠించుచు దేవిని శరణుపొందిన వారికి వారి మరణకాలము తెలిపి, ఆలోపున సకల ఐహిక సుఖములను ఇచ్చి క్రమముగా విరక్తిని కూడ కలుగజేసి, చివరకు తనవద్దకు చేర్చుకొనును. అనగా ఇహపరసౌఖ్యములను రెండింటిని ఇచ్చును. ఆకాశస్వరూపిణి, జగజ్జనని యగు ఆ పార్వతీదేవిని శరణుపొందుచున్నాను.

**శ్లో॥ దేశకాలేషు దుష్టేషు దేవీచన్ద్రకలాస్తుతిః ।**
**సన్ధ్యయోరనుసన్ధేయా సర్వాపద్వినివృత్తయే ॥ 18**

**ప్ర :** దేశకాలేషు = దేశములు, మరియు కాలములు, దుష్టేషు = చెడిపోయినప్పుడు (అనుకూలములు కానప్పుడు), సర్వాపద్వినివృత్తయే = సమస్తమైన ఆపదలు తొలగుటకు, దేవీచన్ద్రకళాస్తుతిః = దేవీచన్ద్రకళాస్తుతి అనుపేరుగల ఈ స్తోత్రము, సంధ్యయోః = రెండు సంధ్యల యందును, అనుసంధేయా = స్మరింపదగినది.

**తా :** దేశములు కాని, కాలములు కాని కలసిరానప్పుడు మనుష్యునికి ఆపదలు సంభవించును. అట్టి సమస్తమైన ఆపదలు తొలగుటకు ప్రాతస్సంధ్యయందును, సాయం సంధ్య యందును ఈ దేవీచన్ద్రకలాస్తుతి పఠించవలెను. అట్లు పఠించిన వారలకు సమస్తమైన ఆపదలు తొలగును.

**ఇతి శ్రీమదప్పయ్యదీక్షితవిరచితా దేవీచన్ద్రకలాస్తుతిః పూర్ణా ॥**

**శ్రీః**



